ಹೊಳೆನರಸೀಪುರ.
నం.

శ్రీ

# శంకర మహా మననము

(శాంకరసిద్ధాంతముయొక్క పూర్ణరూపమును తెలియచేయు ప్రకరణము)

లేఖకులు:

శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారు,
హొళెనరసీపురము.

అనువాదకులు:

శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వాములవారు,
"గీతావాణి" సంపాదకులు.
శ్రీ భూమానందాశ్రమము
గండిక్షేత్రం. (కడప జిల్లా)

ప్రకాశకులు:

అధ్యాత్మ ప్రకాశ కార్యాలయము,
హొళెనరసీపురము (573211)
(హాసనజిల్లా: కర్ణాటక రాజ్యం)

1974.

ఓం

శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారివల్ల

వ్రాయబడి, హొళేనరసీపుర అధ్యాత్మ ప్రకాశ కార్యాలయమునుండి

ప్రకాశింపబడిన సంస్కృత గ్రంథములు:

| | | రూ. పై. |
|---|---|---|
| మాండూక్యరహస్య వివృతి: వ్యాఖ్యాన రూపము. | | 12—00 |
| సూత్రభాష్యార్థతత్త్వ వివేచని: (1 నుండి 3 భాగములు) | | 7—75 |
| వేదాంత ప్రక్రియ ప్రత్యభిజ్ఞ (స్వతంత్ర గ్రంథము) | | 16—00 |
| శుద్ధ శాంకర ప్రక్రియ భాస్కర: (1 నుండి 3 భాగములు) | | 1—60 |
| వేదాంత విద్వద్గోష్ఠి | .... | 2—75 |
| పంచపాదికా ప్రస్థానం | .... | 4—00 |
| నైష్కర్మ్య సిద్ధి | .... | 13—00 |
| గీతా శాస్త్రార్థ వివేకము | .... | 2—25 |
| విశుద్ధ వేదాంతసారము | .... | 1—25 |
| విశుద్ధ వేదాంతపరిభాష | .... | 2—00 |
| బ్రహ్మ విద్యారహస్య వివృతి | .... | 2—00 |

---

గ్రంథములు దొరుకుచోటు:

అధ్యాత్మ ప్రకాశ కార్యాలయము.
P. O. హొళేనరసీపురము, (573211)
(హాసనజిల్లా: కర్ణాటకరాజ్యం)

అధ్యాత్మ ప్రకాశ పుస్తక భండార
హొళెనరసీపుర.
62
నం. తా. 16/4/74

అధ్యాత్మ గ్రంథావళి.

# శ్రీ శంకర మహామననము

(శాంకరసిద్ధాంతము యొక్క పూర్ణరూపమును తెలియచేయు ప్రకరణ)

లేఖకులు:

శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ స్వాములవారు,
హొళెనరసీపురము.

అనువాదకులు:

శ్రీ శ్రీ శ్రీ రామకృష్ణానందస్వాములవారు,
"గీతావాణి" సంపాదకులు.
శ్రీ భూమానందాశ్రమము
గండిక్షేత్రం. (కడప జిల్లా)

ప్రకాశకులు:

అధ్యాత్మ ప్రకాశ కార్యాలయము,
హొళెనరసీపురము (573211)
(హాసనజిల్లా: కర్ణాటక రాజ్యం)

1974.

మొదటి ముద్రణము: 1974

1000 ప్రతులు.

All Rights Reserved by the
Adhyathma Prakasa karyalaya, Holenarasipur.

దీని హక్కులన్నియు
అధ్యాత్మ ప్రకాశ కార్యాలయమువి.

ముద్రాపకులు:
శ్రీ బాలాజీ ప్రెస్,
వన్నియబ్లాక్ స్ట్రీట్, చిత్తూరు, (ఆంధ్రప్రదేశ్.)

---

బెంగుళూరు కార్యాలయ విలాసం.

ADHYATMA PRAKASHA KARYALAYA,
BANGALORE BRANCH,
No. 68, II Block
Subbarama Chetty Lay-Out
P. O. Thyagarajanagara
BANGALORE - 28 (560028)

# ప్రకాశకుల అభిప్రాయము

శ్రీ శ్రీ శ్రీ సచ్చిదానందేంద్ర మహాస్వాములవారు, తన పూర్వాశ్రమములో రచించిన యీ చిన్ని గ్రంథము కన్నడదేశ మెల్లెడల ప్రచారమైనది. దీనియొక్క ఉపయోగము ఆంధ్రభాషాభిమానులగు ముముక్షువులకు కావలయుననెడి సదుద్దేశముతో ఉదార మహాశయులొక్కరు ధనసహాయముచేసి, ఈ గ్రంథమును తెలుగుభాషలో అనువదించి ప్రకాశింపజేయవలయునని ప్రోత్సాహ పరచినందువల్ల దీనిని ఆంధ్రభాషలో ప్రకాశింప జేయుచున్నాము.

శ్రీ భూమానందాశ్రమం గండిక్షేత్రం శ్రీశ్రీశ్రీరామకృష్ణానంద స్వాములవారు మాయొక్క ప్రార్థన స్వంగీకరంచి, యీ గ్రంథమును తెలుగుభాషలో ననువదించి, చిత్తూరు శ్రీ బాలాజీ ప్రెస్ మూలముగా అంద చందములతో ముద్రింపజేసి యిచ్చినందువల్ల మా అభినందన పూర్వక కృతజ్ఞతలను సమర్పించుచున్నాము.

ఆంధ్ర భాషాభిమానులగు ముముక్షువులకు దీనివల్ల ఉపయోగము ఎంతవరకు కలుగుచున్నదో చూచుకొని, జనప్రియమగు ఇంకా కొన్ని గ్రంథములు తెలుగులో ప్రకటింపవలెననెడి గొప్ప ఆశయము గలిగియున్నాము.

హొళేనరసీపురం,
10-3-1974.

వై. నరసప్ప,
కార్యకారి సమితి అధ్యక్షులు,
అధ్యాత్మ ప్రకాశ కార్యాలయం.

# పీఠిక

ఈ చిన్ని పుస్తకములో వేదాంత ప్రక్రియ రహస్య మంతా, శ్రీ శంకర భగవత్పాదులయొక్క అమృతవాణి ఆధారముతోనే బయలుపరిచినాము. ఆచార్యులవారు చెప్పిన విషయములు, తన రచనాగ్రంథములలో దేనిలో తెలిపినారో దానిని తెలుసుకొనుటకుగాను, ఆ యా భాష్యముల అధ్యాయ ములయొక్క సంఖ్య చూపబడినది. బ్రహ్మసూత్రం, ఉపనిష త్తులు, భగవద్గీత-అను ప్రస్థానత్రయ భాష్యములలో భగవ త్పాదులవారు-ఇదేవిషయమును సందర్భానుసారముగా మరి మరి చెప్పియుండుటవల్ల కొన్ని స్థలములు మాత్రం ఇచ్చట చూపబడినవి. ఈ గ్రంథమునందు ఆచార్యులవారి మాటలను అక్షరశః నిరూపించియుండలేదు. ఆ యా అభిప్రాయములను తీసికొని వేరే మాటలలో వ్రాయబడియున్నది.

ఈ పుస్తకము క్రొత్తగా చదివేవారికి వేదాంతము యొక్క పూర్ణ ఉపదేశమున్ను, ఇంతకు ముందు చదివినవారికి అనుసంధానము చేయుటకు తగిన సంగ్రహమున్ను, కొంత మందికైనా ప్రయోజనము గలిగించునని నా యొక్క ఆశయము.

అధ్యాత్మప్రకాశ కార్యాలయం,
బెంగుళూరు శాఖ,
బెంగుళూరు-560028
తేది 10—3—1974.

గ్రంథకర్త.

# సంకేతముల వివరము

ఉప. గ. ఉపదేశసాహస్రి, గద్యభాగము (పేరాసంఖ్య ఇవ్వబడినది.)

మాం. కా. గౌడపాదులు వ్రాసిన మాండూక్యకారికల యొక్క భాష్యము (సంఖ్యలను ప్రకరణ – కారికలు – ఇట్లు క్రమముగా ఇవ్వబడినది.)

గీ. భా. భగవద్గీతాభాష్యము (అధ్యాయ శ్లోకముల సంఖ్య క్రమముగా ఇవ్వబడినది.)

బృ. భా. బృహదారణ్యకోపనిషత్తు యొక్క భాష్యము (అధ్యాయ బ్రాహ్మణ, మంత్రములు ఇట్లు ఇవ్వబడినవి).

అ. భా. మున్నుడి, బ్రహ్మసూత్రభాష్యమున ప్రారంభములో నుండు అధ్యాసభాష్యము.

మాం. భా. మాండూక్యోపనిషత్తు యొక్క భాష్యము (దీనికి మంత్ర సంఖ్య ఇవ్వబడినది).

ముం. భా ముండకోపనిషత్తు యొక్క భాష్యము (ముండక, ఖండ, మంత్ర, ఈ సంఖ్యలు క్రమముగా ఇవ్వబడినవి).

కేవల సంఖ్య ఇవ్వబడినవన్నియు బ్రహ్మసూత్రభాష్య సంబంధమని తెలియవలెను. సంఖ్యలు క్రమముగా అధ్యాయము, పాదము, సూత్రము – వీటిని సూచించును. భా. భా. అను సంఖ్యలు శ్రీ జయచామరాజేంద్ర గ్రంథరత్నమాలలో ప్రకటింపబడిన ప్రస్థానత్రయగ్రంథములయొక్క భాష్య భాగ సంఖ్యలను తెలియపరచును.

---

టిప్పణి:- హొళేనరసీపురమువారి అధ్యాత్మ ప్రకాశ కార్యాలయమున ముద్రింపబడిన కన్నడ గ్రంథము యొక్క సంఖ్య. (పైె సూచితము)

# పారిభాషిక శబ్దములు అనుక్రమణిక



సూచన:— ఇందు చూపబడిన సంఖ్యలు ఆయా గ్రంథ భాగముల సంఖ్యలు.

ఓమ్

# శ్రీ శంకర మహామననము

---

1. "బ్రహ్మవిద్య" యనిన బ్రహ్మమును తెలుసుకొనుట. బ్రహ్మము యొక్క నిజస్వరూపమును తెలుసుకొనుటదే పరమపురుషార్థసిద్ధి. మనుష్యునికి కావలసిన ప్రయోజనములన్నిటిలో యిదే హెచ్చైనది. బ్రహ్మమును కనుగొన్న జనులకు, వారికున్న సర్వానర్థములు మొదలంట నశించిపోగలవు. (1_1_1; భా. భా. 18)

2. బ్రహ్మమనిన యెప్పటికిని ఉండునదియును, పరిశుద్ధమైనదియును, జ్ఞానస్వరూపమైనదియును యెట్టిబంధమునకును లోబడని స్వరూపము కలదియునునగు వస్తువు. ఇది యెఱుగని వస్తువులేదు; అన్నింటిని యెఱుగుచున్నది యిదియే; దీనియందు లేని శక్తిలేదు. అన్ని విధములగు శక్తులును నున్నవి. (1_1_1; భా. భా. 19)

3. మన యెదుటనుండు ప్రపంచమునందు వివిధనామ రూపములతో కూడియున్న పదార్థములు మనకు గోచరములగుచున్నవి; విధవిధములగు కర్మముల నాచరించి అవ్వాని ఫలముల ననుభవించుచున్న లెక్కకు మిక్కిలి జీవులున్నారు; జీవులాచరించు కర్మములకు యీస్థలమున యీ కాలమున యిట్టి హేతువుచేతనే ఫలము కలుగవలెననెడి నియమము కూడ నున్నది. దీనిని యెవరు యేవిధమున చేసివుండవచ్చునని మనస్సులో ఆలోచించుటకు కూడ అందని విషయమై

యున్నది. ఇంతటి యీ ప్రపంచము తోచి అణగుటకు ఆధారమై యేది యున్నదో అదే బ్రహ్మము. (1_1_2; భా. భా. 24)

4. ఈ బ్రహ్మము యెవ్వరూ కానని యెచ్చటో వుండు వస్తువు కాదు. మనయొక్క స్వరూపమే అయియున్నది. మన నిజమగు స్వరూపమునకే ఆత్మయని పేరు. ఈ విధముగ మన ఆత్మయే బ్రహ్మమైయుండుటవలన ఆత్మవిద్యయే బ్రహ్మవిద్య. ఆత్మను తెలుసుకొన్నచో బ్రహ్మమును తెలుసుకొన్నట్లే యగును. (1_1_1; భా. భా. 19 మాం. 2)

5. రోగముచేత బాధపడు వానికి రోగ బాధ తొలగినచో వాడు తన మొదటి ఆరోగ్యస్థితిని పొందగలడు కదా! ఆ విధముననే సంసారదుఃఖమును అనుభవించుచున్న మనకు మన ఆత్మ, బ్రహ్మమే యనియు అది యెప్పుడూ వుండునదనియు శుద్ధమైనదనియు సంసారబంధ సంబంధమే కొంచెమును లేనిదనియు, చైతన్య మాత్రమనియు తెలిసినంతనే దుఃఖములు సమూలముగ తొలగి మనయొక్క స్వభావస్థితి మనకు లభించుచున్నది. ఇదియే బ్రహ్మవిద్య యొక్క ప్రయోజనము. (మాం. 1. భా. భా. 2)

6. ఆత్మయందు లేని సుఖదుఃఖములను దానియందు కల్పించుకొని ఆత్మకు దేహ ఇంద్రియ మనోబుద్ధి అహంకారముల సంబంధము తగుల్కొనినదని అనుకొనుటే అవిద్య. మన ఆత్మ నిత్య శుద్ధమైనదనియు దానికి మరియొక్క వస్తువుతోడి సంపర్కము యేమాత్రము లేదనియు, ఉండునను మాటకు ఆస్కారమే లేదనియు నిశ్చయించుటే విద్య. (అ భా. 4)

7. "నేనున్నాను" — అని ప్రతియొక్కడును తెలుసుకొనుచునేయున్నాడు; "నేను లేను" అని అనుకొనుట యెవ్వనికిని లేదు. ఈ "నేను" అను వస్తువుయొక్క నిజస్వరూపమును తెలియవలెను. ఈ స్వరూపమే. అనగా ఆత్మయే బ్రహ్మము. ఆ కారణముచేత, బ్రహ్మమనెడి వస్తువు ఉన్నదో లేదో అను సంశయమునకు కారణమే లేదు.

(1-1-1. భా. భా. 19)

8. "నేను" అను వస్తువున్నదను విషయమునందు, యెవ్వరికిని సందేహము లేకపోయినను, "నేను" అను వస్తువెద్ది? యను విషయమును గురించి ఒక్కొక్కరి అభిప్రాయమొక్కొక్క విధమునను్నది. మన శరీరమందు తెలివియనుగుణమున్నదనియు అదే చైతన్యమనియు ఆ చైతన్యముతో కూడిన దేహమే మన ఆత్మయనియు కొందరు భావించుచున్నారు. ఈ చైతన్యము యింద్రియములందున్నదనియు అందువలన యింద్రియముల సమూహమే ఆత్మయనియు కొందరి అభిప్రాయము. ఈ బాహ్య ప్రపంచమంతయు యే మనస్సుకు గోచరించుచున్నదో, ఆ మనస్సే మన ఆత్మయని కొందరి మాట. మనస్సులో ఉప్పతిల్లు విజ్ఞాన పరంపరల ధారయే మన ఆత్మ అని మరి కొందరి నిశ్చయము. ఆత్మయనునది లేనే లేదని కొందరి నమ్మకము—దేహము యింద్రియములు మనస్సుబుద్ధి - వీటన్నింటికి వేరై జీవుడనబడు వాడొకడున్నాడనియు కర్మలను ఆచరించి వాటి ఫలములను అనుభవించుటే వాని నిజమైన స్వరూపమనియు కొందరి నమ్మిక. జీవునికి సుఖదుఃఖములుండుట నిశ్చయమే అయినను వాడు నిజముగ యెట్టి కర్మమును చేయుట లేదనుట కొందరి మతము.

సంసారియగు జీవుడొక్కడేకాదు; వానికంటె వేరై యీశ్వరుడను ఒక ఆత్మ కలదనియు అతడే సర్వజ్ఞుడు సర్వశక్తుడు అయియున్నాడనియు కొందరి అభిప్రాయము. మరి కొందరు ఆ సర్వజ్ఞుడు సర్వశక్తుడూ అయిన యీశ్వరుడే మన ఆత్మయని చెప్పుచున్నారు.

ఈ విధముగనే, "నేననితోచు వస్తువునకు నిజమైన స్వరూపమొకటి వున్నదా? లేదా? ఉన్నచో, అది దేహాదులకంటె వేరా? ఒకటేనా? వేరైనచో అది సుఖదుఃఖములను అనుభవించుచున్నదా? లేదా అనుభవించునదైనచో, కర్మములను చేసి ఫలము ననుభవించుచున్నదా? లేక, ఊరక ఊరక సుఖదుఃఖములను అనుభవించుచున్నదా? సుఖదుఃఖములను అనుభవించుచున్నదనినచో యెట్టి సుఖదుఃఖముల సంపర్క సంబంధమేలేని పరమాత్మ వస్తువొక్కటున్నదా లేదా? ఉన్నచో ఆ పరమాత్మకు జీవాత్మకు సంబంధమేమి?" అని యీ విధమున ఆరుసందేహములు విచారకులకు కలుగు అవకాశమున్నది. ఈ సందేహములను నివారించుకొనక గ్రుడ్డిగ యేదో ఒక అభిప్రాయమునకు తలయొగ్గి నడచినచో కల్గవలసినలాభము కలగకపోవుటయేకాక కల్గకూడని అనర్థములు కల్గుటకూడనుండును. అందువలన ఆత్మవస్తువునుగురించి విచారముచేయుట అత్యగత్యము. (1-1-1 భా. భా.20)

9. "నేను-నేను" అని జనులు వ్యవహరించుచుండుట నిజమే అయినను 'నేను' అనెడి ఒక సత్యమైనవస్తు వేదియూ లేదు. ఇట్లే, బైట మనకు తోచు ప్రపంచము వ్యవహార

రీత్యా ఆ విధముగ కనపడుచున్నదే కాని చక్కగ విచారించి నచో దీనికిది స్వరూపమని ప్రమాణపూర్వకముగ నిరూపించు టకు వీలులేదు. అందువలన జీవుడు జగత్తు ఈశ్వరుడను వ్యవహారము పట్టి భ్రమమాత్రము. ఆ వాసనతో యోచించి యోచించి జనులు గ్రుడ్డిదాటుగా ప్రపంచమొకటున్నది. జీవులనేకులున్నారు, ఈశ్వరుడొకడున్నాడని వ్యవహరించు చున్నారే కాని, పరమార్థమున యే ఒక్క వస్తువును లేదు. యుక్తికి అందక కనపడుటే జగత్తుయొక్క లక్షణము" అని కొందరందురు. వీరినే శూన్యవాదులని అందురు.

ఈ వాదము జనుల అనుభవమునకు విరుద్ధమైనది. ఏదో ఒక పరమార్థము లేనిచో యీ విధముగ నిదంతయు తోచ గల్గినదెట్లు? కనపడుచున్నది కాబట్టి యీ కనపడునది సత్యము అని నమ్ముటకు యోగ్యమైయున్నను దానిని భ్రాంతి యని చెప్పుటకు కారణమేమి? కనబడు జగత్తు యుక్తికి అనుకూల పడలేదు కాబట్టి భ్రాంతి అనుటకంటె, అనుభవమునందు కనపడు దానికి సరిపడలేదు కాబట్టి మనయుక్తియె తప్పయి యుండునని అనుకొనుట మేలుకాదా? ఇందువలన శూన్య వాదము ప్రమాణవిరుద్ధమగు మతము. దీనిని యెవ్వరూ నమ్మరు కాబట్టి ఈ మతమును ఖండించవలసిన పనిలేదు.

(2-2-31 శా. భా. 64)

10. మన ఆత్మయే లేదని చెప్పుట సరియైన మాట కాదు. ఎందుకనిన, ఆత్మలేదని యెవ్వడు చెప్పుచున్నాడో వాని స్వరూపమే ఆత్మ. (1-1-4) ఆత్మ మరియొక ప్రమాణము

ఆధారముతో క్రొత్తగ సిద్ధమగు వస్తువుకాదు. అది సిద్ధమయ్యే యున్నది.

దేని సహాయముతో తెలుసుకొనుచున్నామో అది ప్రమాణము. దేనిని తెలుసుకొనుచున్నామో అది ప్రమేయము. ఇది ప్రమాణము, యీది ప్రమేయము - అను వ్యవహారము పుట్టుటకుముందే ఆత్మవుండుట ఆవశ్యకమై యున్నది. ఎందుకనిన, ఆత్మయే ప్రమాణములద్వారా ప్రమేయములను యెఱుగుచున్నాడు. ప్రమాణములద్వారా ప్రమేయములను యెఱుగువాడే లేడని అన్నచో ప్రమాణ ప్రమేయవ్యవహారమే లేనిదగుచున్నది. అట్లే కానిమ్మని అన్నచో శూన్యవాదమును ఒప్పుకొన్నట్లగును. ఆ శూన్యవాదము అనుభవ విరుద్ధమైనది. ఎందుకనిన - "సర్వమూ శూన్యము" అని నిర్ధారణచేయుటకు కూడ ఆత్మ కావలసియున్నది.

(2-8-7 ఛా. భా. 99)

11. ప్రమాణములు రెండువిధములు. జనులందరును సామాన్యముగ ఉపయోగించుచుండెడి ప్రత్యక్షము అనుమానము మొదలగునవి లౌకిక ప్రమాణములకు చిక్కని వస్తువులను తెలిపెడి శాస్త్రము అలౌకిక ప్రమాణము. ఈ రెండు విధములైన ప్రమాణములకు లభ్యములగు వస్తువులన్నియు ప్రమేయములనబడును. కాని ఆత్మయే ప్రమాణమును అపేక్షింపక, ప్రమాణవ్యవహారమునకు తానే ప్రాణముపోయుచున్నందున ఆత్మ అప్రమేయమని చెప్పబడినది. ఆత్మ ప్రమేయము కానిదని స్వతస్సిద్ధమైనదని ప్రమాణముల అపేక్ష లేక స్వతః

ప్రసిద్ధమైయుండునదని తెలిసినవారు చెప్పుదురు.

(2-3-7 భా. భా. 99; గీతా 2-18 భా. భా. 29)

12. ఆత్మ దేహమునకంటె వేరుగలేదనియు దేహమున్నప్పుడే తెలివి కనపడుచున్నది కాబట్టి చైతన్యము దేహముయొక్క ధర్మమని కొందరు భావింతురు. ఇది సరికాదు. ఎందుకనిన, దేహము జ్ఞానమునకు విషయమగుచున్నది. ఏది ప్రకాశింపజేయుచున్నదియో అది విషయి; దేనిని ప్రకాశింపజేయుచున్నదో, అది విషయము. జ్ఞానము, దేహము మొదలగువాటిని తెలుసుకొనుచున్నది కాబట్టి జ్ఞానము విషయి, దేహాదికములు విషయము. విషయి విషయము యొక్క ధర్మము కాజాలదు. దీపము తాను ప్రకాశింపజేయు ఘటముయొక్క ధర్మముకాదు. దేహమునందలి ధర్మములు తాము తమ తమ స్వరూపమును కాని ఒక్కటి మరొక్కదాని ధర్మమునుకాని తెలియలేవు. జ్ఞానము దేహమునూ దాని సమస్తధర్మములనూ తెలుసుకొనుచున్నది. అందువలన జ్ఞానమనునది దేహధర్మముకాదు. ఇంతేగాక, దేహముండిననే జ్ఞానముండునను నియమమూ లేదు. స్వప్నమున ఈ దేహము లేకున్నను జ్ఞానమున్నదనుట అందరికీ తెలిసిన మాట. అందువలన దేహమునకంటె జ్ఞానము వేరే. జ్ఞానమునే చైతన్యమందురు. అదే ఆత్మ.

(3-3-54. భా. భా. 418.)

13. ఆత్మ ఇంద్రియాదులను తెలుసుకొను చుండుట వలన విషయములైన యింద్రియముల ధర్మమే ఆత్మయనెడి మాట అనుభవ విరుద్ధమైన మాట. "దీనిని మూచూచుచున్నాను" అని వ్యవహరించునప్పుడు, మూచూచి వాసనను

తెలుసుకొనువాడు ఆత్మ. ముక్కు అను యింద్రియము వాసనను తెలుసుకొనుటకు సాధనము. కర్త కరణమునకంటె వేరై యుండవలయును కదా! కన్ను చెవి మొదలైన వాటి యందు గల యింద్రియములు ఆయా విషయములను తెలుసు కొను కరణములు. వాటి సహాయమున తెలుసుకొను చైత న్యమే ఆత్మ. అందువలన ఆత్మ యింద్రియాలకంటె వేరే.

(2-3-18 భా. భా. 124.)

14. ఆత్మ దేహమున కంటెను యింద్రియముల కంటెను వేరుగనున్నట్లే మనస్సు కంటెను వేరయ్యేయున్నది. గాఢ నిద్రలో దేహముండుట లేదు. ఇంద్రియములుండుట లేదు. మనస్సుండుట లేదు. (1_1_9 భా. భా. 85, 2-3_40 భా. భా. 152.) అప్పుడు యెట్టి జ్ఞానమూ లేదు కాబట్టి ఆత్మ లేదని చెప్పవలెనా? అనిన నిద్రలో తనకంటె వేరైన రెండవ వస్తువు లేదు కాబట్టి విశేషజ్ఞానము లేదే కాని తానుకూడ లేక పోవుట లేదు. (బృ 4_3_23) "నేను" అను జ్ఞానము కూడ లేనందువలన ఆత్మ కూడ లేదనుట సరియని తోచవచ్చును. అయినను, "సుషుప్తిలో ఏమీ లేదు" అనునది కూడ ఒక అనుభవమే. ఆ అనుభవమే చైతన్యరూపమగు ఆత్మ_'నేను' ఇది, అనెడి తెలివికి విశేషజ్ఞాన మని పేరు. ఇది ఆత్మకంటె వేరైన వస్తువులు ఉన్నప్పుడు మాత్రమె తోచును. కాని, 'నిద్రలో నాకేమీ తెలియ లేదు' అను అనుభవము వలన రెండవ వస్తువే లేదని సిద్ధమగుచున్నది. అంతేకాని, నిద్రలో తానే లేనని పట్టు పట్టినచో నిద్రయను అవస్థే లేదని చెప్పి నట్లగును; ఇది లోకానుభవమునకు విరుద్ధము. అందువలన, ఆత్మ, దేహేంద్రియమనోబుద్ధి అహంకారముల కంటె వేరైన

చైతన్య స్వరూపి యని గాఢ నిద్రయొక్క అనుభవమున నిర్ణయమగుచున్నది.

(ఉప. గ. 2. భా. 56.)

15. ఆత్మ కర్తృభోక్తృరూపమైనదా? కాదా? కర్మములను చేసి ఫలమును పొంది అనుభవించుటనునది మన ఆత్మకు స్వభావమా కాదా? ఈ శంకకు రెండు విధములైన సమాధానములున్నవి: ఒక దృష్టిలో ఆత్మకు కర్తృత్వ భోక్తృత్వములున్నవి; మరొక్క దృష్టిలో లేవు. బాడిస మొదలగు పనిముట్లను ఉపయోగించునప్పుడు మాత్రము మనుష్యుడు వడ్రంగియని అనిపించుకొనును. లేనప్పుడు అందరివలెనే మనుష్యుడు. అట్లే శరీరేంద్రియములతో కూడికొని వుండు జాగ్రత్ స్వప్నములలో ఆత్మకు కర్తృత్వము భోక్తృత్వము నున్నది; నిద్రలో యెట్టి సాధనములు లేనందువలన ఆత్మ కర్తయు కాదు; భోక్తయు కాదు. మొత్తమునకు చూచినచో కర్మములను చేసి ఫలములను అనుభవించుటనునది ఆత్మయొక్క స్వభావమునకు సంబంధించినది కాదు, అని చెప్పియే తీరవలెను.

(2-3-40 భా. భా. 152)

16. ఆత్మకు కర్తృత్వమున్నప్పుడు, మనమే కర్మములను చేయుచున్నామా? లేక మనలను కర్మలో ప్రవర్తింపజేయు పరమేశ్వరు డొక్కడు వేరే యున్నాడా? మనము కర్మఫలములను అనుభవించునప్పుడు కర్మమువలననే ఫలము వచ్చుచున్నదా? లేక ఫలము నొసగు యీశ్వరుడొక్కడున్నాడా? (అను సంశయము కలుగును. అట్టి ఈశ్వరుడొక్కడున్నాడు;) శరీరేంద్రియాదికములే తానని భావించి అవిద్య

యను ఆవరణముతో ముందు కానక యుండువాడు జీవుడు. జీవుల కర్మములకు అధ్యక్షుడై సకల ప్రాణులందును నివసించి సాక్షియై చైతన్యరూపమై యుండువాడు యీశ్వరుడు. జీవుడు చేయు ధర్మాధర్మములు వాటి ఫలమూ యీశ్వరుని అనుగ్రహముననే నడచును.

(2-3-41, 42; భా. భా. 155, 3-2-38; భా. భా. 314; గీ. 13-22 భా. భా. 273; ము. 3-1-1 భా. భా. 91)

17. కర్మచేసి ఫలము ననుభవించు జీవునికి యీశ్వరునికి సంబంధమేమనిన, జీవుడే యీశ్వరుడు. దేహాదికములు నేననెడి భ్రాంతిజ్ఞాన ముండువరకు జీవులమగు మనకంటె యీశ్వరుడు వేరుగనె యుండును. నిజము నెఱిగినచో జీవత్వమే లేదు. ఎందుకనిన ఈశ్వరుడు యెప్పుడెప్పుడు మన పరమాత్మయైయున్నాడు. అనగా పరమార్థమైన మన స్వరూపమై యున్నాడు.

(గీ. 13-2, భా. భా. 216; గీ. 13-22, భా. భా. 273; గీ 15-19, భా. భా. 382; 1-1-6; 1-3-19; భా. భా. 75; 274.)

18. జీవుడు నిజముగ పరమాత్మయే యనెడి విషయమునందు అనేక సంశయములు వచ్చును. జీవుడు చావు పుట్టుకలు కలవాడు; అట్టివాడు చావుపుట్టుకలు లేని పరమాత్మయనిన సంగత మెట్లగును ? అనునది మొదటి సంశయము.

అయినను, చక్కగ విచారించినచో జీవుడు నిజముగ పుట్టుటయు లేదు; చచ్చుటయును లేదు. శరీరము పుట్టుచున్నది. చచ్చుచున్నది. పాతగుడ్డను తీసివేసి క్రొత్తగుడ్డను

గిట్టగొన్నంత మాత్రమున మనుష్యుడు వేరేవాడగుచున్నాడా? లేదు. ఇట్లే, శరీరము పుట్టినచో జీవుడు పుట్టుటలేదు. శరీరము పడిపోయినచో జీవుడు చచ్చుటయూ లేదు.

(గీ. 2-22, భా. భా. 44; 2-3-16, భా. భా. 118; 2-3-17, భా. భా. 121)

19. జీవునికి శరీరము యింద్రియములు ప్రాణము మనస్సు బుద్ధి అహంకారము — వీటి సంబంధమున్నది. ఇట్టి జీవుడు యెట్టి శరీరమూ లేని పరమాత్ముడగుట యెట్లు? అను పది రెండవ సంశయము.

నిజము విచారించినచో, జీవునికి శరీరాదికములు ఉన్న వనుటకు ప్రమాణము లేదు. శరీరాదికములన్నియు విషయములై యున్నవి. తాను విషయియై యున్నాడు. విషయియగు తనకు విషయములగు శరీరాదికముల సంబంధమున్నదని తలంచుట న్యాయముకాదు. ఒక కుండ మనజ్ఞానమునకు విషయమైయున్నది. ఉండవచ్చును. అంతమాత్రమున ఆ కుండయె మన స్వరూపమని కాని ఆ కుండ మనకు సంబంధపడి యున్నదని కాని మన మనుకొనుట లేదు. ఇట్లే శరీరాదికములు మనకు సంబంధపడియున్న వనుటకు యెట్టి ప్రమాణమును లేదు. శాస్త్రములందు "ఆత్మ అశరీరి" అని చెప్పబడియున్నది.

(క. 1-2-22, భా. భా. 78; గీ. భా. 13-13, భా. భా. 254; 1-1-4 భా. భా. 58)

20. జీవాత్మకు దేహాదికములు సహజమైయున్నవని భావించుటయూ తప్పే, ఎందుకనిన — స్వప్నములో యీ

దేహాదికములు యేవీ ఉంకుటలేదు. అచ్చట కేవలము మాయి కములగు దేహాదులతోడనే వ్యవహారము జరుగుచున్నది. జాగ్రత్తకును స్వప్నమునకును యెట్టి భేదమును చూపుటకు వీలులేదు. కాబట్టి, ఇది జాగ్రత, యిది స్వప్నము అని విడ మరచి తెలియు వీలులేదు. కాబట్టి, జాగ్రదవస్థలోని దేహాది కములు కూడ మాయికములే. ఈ మాయిక దేహాదికముల సంబంధము ఆత్మకున్నదని చెప్పుటకు వీలేలేదు.

(3-2-3 భా. భా. 256; కా. 2-4 భా. భా. 81; కఠ. 2-5-11, భా. భా. 148)

21. జీవులు అనేకులు; వారందరు తమకు దేహాదికము లున్నవని ఒప్పియున్నారు. ఒక జీవుడు తనకు స్వప్నములో మాయిక దేహాదికములున్నవని తెలిసినంత మాత్రమున అందరూ అంగీకరించిన జాగ్రత్తలోని శరీరాదికములు జీవునికి లేవనుట యెట్లు? జీవులు అనేకులు; పరమాత్మ ఒక్కడు. ఈ అనేకులగు జీవులు ఒక్కడగు పరమాత్మయగుట యెట్లు? అనునది మూడవ సంశయము.

అవును. జాగ్రత్తలోవలెనే స్వప్నములోకూడ కర్తలు భోక్తలు అనేకులగు జీవులున్నట్లును సమష్టిగా వ్యవహారము చేయుచున్నట్లును కనపడుటలేదా! అంత మాత్రమున అచ్చట తోచు జీవులును వారి శరీరాదులును సత్యములని మనము నమ్ముచున్నామా? లేదు. అట్లే జాగ్రదవస్థలోని జీవులను వారి శరీరములను తెలియవలెను. స్వప్నమునందు ఒకే ఆత్మ అనేకముగ తోచుచున్నది. జాగ్రదవస్థయందు కూడ అంతే యని తెలియవలెను.

(2-1-28; భా. భా. 465; కా. 4-37, భా. భా. 278)

22. మాయిక దేహాదికముల సంబంధమైనను జీవునికి కుంఠ నేవున్నదికదా? అనినచో అదికూడ ఆత్మకు స్వభావము కాదు. ఆత్మ దేహాదికముల సంబంధమును పూర్తిగవదలి స్వాభావికమైన బ్రాహ్మీస్థితియందే ఉండుట గాఢనిద్రలో మనందరి అనుభవమైయున్నది. అదియుగాక, ప్రయత్న పూర్వకముగ సమాధిస్థితిని బొంది ఈ బ్రహ్మస్వరూపమును దర్శింపవచ్చునని శాస్త్రములందు చెప్పబడియున్నది.

(3-2-7; భా. భా. 270; 3-2-24, భా. భా. 299)

23. నిద్రయందుకాని సమాధియందుకాని 'నేను బ్రహ్మమైయున్నా'ననెడి జ్ఞానము ఉండుటలేదు. 'నాకు అప్పుడు యేదియూ తెలియదు' అని మేల్కొన్న తర్వాత తెలియుచున్నాడు. అందువలన నిద్రయందుకాని సమాధి యందుకాని జీవునికి అజ్ఞానమున్నట్లే అయినది. ఇట్టి జీవుడు సర్వజ్ఞబ్రహ్మమెట్లు కాగలడు? అనునది నాల్గవ సంశయము.

అయినను, నిద్రయందు 'నేనిట్టివాడ' నని తెలియ కుండుటకు తానొక్కడే వుండుట కారణముకాని అక్కడ అజ్ఞానముండుట కారణముకాదు. ఎందుకనిన – 'నేనేమీ తెలుసుకొనుట లేదు' అనినప్పుడు యితరమగు రెండవ వస్తువును తెలుసుకొనుటలేదని అర్థము కాని తన జ్ఞానస్వరూ పమే లేదని అర్థముకాదు. 'ఇది యిట్టిది' ఇది యిట్టిది అని విడి విడి జ్ఞానము నిద్రలో లేనిమాట నిజమే. అప్పుడు యింద్రి యములులేవు కాబట్టి ఆ విడివిడి తెలివిలేదు. అదే కారణము కాని, ఆత్మస్వరూపమగు తెలివి లేకపోవుట కాదు.

(బృ. 4-3-21; బృ. 4-3-23)

24. జీవునికి జాగ్రత్స్వప్నములలో దేహాదికముల సంబంధమున్నది. నిద్రలో లేదు. ఈ విధమున దేహాదికముల సంబంధమును పడయుచు విడుచుచు నున్నవాడు నిత్యముక్తుడని యెట్లు చెప్పబడు ననునది అయిదవ సంశయము.

దేహాదికములు పరమార్థముగ లేనేలేవు. జాగ్రత్స్వప్నములలో అవి ఉన్నట్లు తోచుచున్నవి, అన్ని అవస్థలను ఆత్మ సాక్షియై చూచుచున్నాడు, అని వెనుక చెప్పబడినది. ఆత్మచైతన్యము యెప్పుడెప్పుడు మార్పులేక ఒకే రూపమున నుండుట చేతనూ మాయికములగు దేహాదికముల వికారములు యేవిధముగను ఆత్మచైతన్యమున కంటవు కావునను ఆత్మ నిత్యముక్తము అని చెప్పుటకెట్టి ప్రతిబంధకమును లేదు.
(మా. 7; का. 2-32, भा. भा. 115)

25. జీవుడు పరమాత్ముని అంశయని శాస్త్రములందున్నది కదా! శాస్త్ర ప్రమాణమును కాదని జీవుడే పరమాత్మ యని చెప్పనగునా? అనునది ఆఱవ సంశయము.

శాస్త్రము ప్రత్యక్షాదులవలెనే ప్రమాణమైయున్నది కాబట్టి ప్రమాణస్వభావము కలదయ్యేయున్నది. ప్రమాణమనిన ఉన్నదానిని ఉన్నట్లు తెలుపుసాధనము; ఏ సాధనము లేనిచో మనకు ఆ విషయము తెలియదో, ఆ సాధనము ఆ విషయమున ప్రమాణమనబడుచున్నది. ప్రమాణము ఉన్నదానిని తెల్పునేకాని లేనిదానిని తెచ్చిపెట్టలేదు. శాస్త్రము ఆత్మవిషయమున ప్రమాణమగుచున్నది, అది ఆత్మవిషయమున మనకు సంశయమునూ అజ్ఞానమును భ్రమను కల్గించక

తెల్పినచో ప్రమాణమగునే కాని అనుభవ విరుద్ధముగ తెల్పినచో ఎప్పుడూ ప్రమాణముకాలేదు. మన ఆత్మ బ్రహ్మస్వరూపమున్నది అనుభవసిద్ధము. ఆత్మయే బ్రహ్మమని శాస్త్రమునందును చెప్పబడినది. అనుభవ విరుద్ధమైయున్న యే వాక్యమునకును ప్రామాణ్యత సిద్ధించదు.

(బృ. 2-1-20, భా భా. 315; గీ. 18-66, భా. భా. 600)

26. అట్లైనచో జీవుడు పరమాత్మని అంశయని శ్రుతియందును స్మృతియందును. చెప్పబడినది కదా! ఆ మాటకు గతియేమి? అని అడుగవచ్చును 'జీవుడు పరమాత్మని అంశము' అనిన, సూర్యుని ప్రతిబింబము సూర్యుని అంశమన్నట్లు, మిణుగురులు అగ్ని అంశమనినట్లు, ఘటాకాశము మహాకాశము యొక్క అంశమనినట్లు అర్థము గ్రహించవలెను. అనగా, అదే జాతికి చెందినదని తెలుసుకొనవలెను. ప్రతిబింబములు అనేకమైయున్నను బింబము ఒక్కటేయైయున్నట్లు జీవులు అనేకులైనను వారి ఆత్మ నిజముగ నొకటే; జీవుడు స్వరూపతః చైతన్యమే; మిణుగురులు నిప్పూ ఒకటే అయియున్నట్లు జీవులూ బ్రహ్మమూ ఒకే చైతన్యమయ్యే ఉన్నారు. ఘటాకాశము, గృహాకాశము అని వ్యవహారములో ఆకాశములను అనేకముగా చెప్పిననూ ఆకాశము ఒక్కటే అయియున్నట్లు, జీవులు అనేకులని వ్యవహారమున్నను వారి స్వరూపమైన బ్రహ్మ మొక్కటియే. ఈ విధముగ తెల్పుటయే అంశవాక్యముల ఉద్దేశము.

(2-3-43 భా. భా, 158; 2-3-50, భా. భా. 168;
3-2-18; భా. భా. 285; బృ. 2-1-20, భా. భా. 316;
కా. 3-3-7, భా. భా. 132, 142)

27. జీవుడు పరమాత్మని అంశమనెడి వాక్యముల వాచ్యార్థమునే గ్రహించినచో దోషమేమి? వినుము. అంశమనెడి మాటకు అర్థము అవయవమనియో వికారమనియో శక్తియనియో అవస్థయనియో చెప్పవలసియుండును. పరమాత్మ యందు అనేక భాగములున్నవనియూ వాటిలో ప్రతి యొక్కటియు జీవుడనియూ కల్పించినచో, అవయవములు చేరుకొని ఉన్నప్పుడు మాత్రము అవయవి ఉండి, అవి విడివడి పోయినపుడు వెంటనే నశించిపోవునట్లు, పరమాత్మకు కూడ అదేగతి కల్గవలసియుండును. అది ఒప్పదగిన మాటకాదు. అందువలన జీవుడు పరమాత్మని అవయవముకాదు. ఇక, జీవుడు పరమాత్మని వికారమనినచో అనగా మన్నుమారి కుండ అయినట్లు పరమాత్ముడు మార్పుచెంది జీవుడైనాడన్నచో, అప్పుడుకూడ పరమాత్మనికి నాశము ఒప్పక తప్పదు. అందువలన జీవుడు ఆత్మయొక్క వికారమును కాదు. సర్వశక్తుడగు యీశ్వరుడు బంధమునకు లోబడుననుట సరిగాదు కాబట్టి జీవుడు యీశ్వరుని శక్తియనుటయు ఒప్పదగినదికాదు. పరమాత్ముడు మొదట పరిశుద్ధుడై దుఃఖహీనుడైయుండి ఆ తర్వాత అశుచియు దుఃఖమయమును నగు సంసారమును పొందెనని చెప్పుటయు సమంజసముకాదు కాబట్టి జీవుడు పరమాత్మని అవస్థ అనుటయు పొసగదు. అందువలన 'జీవుడు పరమాత్మని అంశ' మనెడి వాక్యమునకు అక్షరార్థము చెప్పుకొనుట పొసగదు.

(బృ. 3-8-12, భా. భా. 94)

28. ఇది విహితము యిది నిషిద్ధమని శాస్త్రమునందు జీవునికి చిత్తశుద్ధికొఱకు కర్మలు చెప్పబడినవి; ఈశ్వరుని

అనుగ్రహమును సంపాదించుటకు ఉపాసన చెప్పబడినది. మోక్షమును పడయుటకు అనుకూలమైన జ్ఞానమును చెప్ప బడినది; జీవుడే బ్రహ్మమైనచో ఈ సాధనములన్నియు వ్యర్థ ములగును కదా! అనునది యేడవ సంశయము.

దీనికి పరిహారమేమనిన - శాస్త్రమునందు - మోక్ష మునకు ఉపాయము జ్ఞానమని చెప్పియుండుట చేత, బంధము అజ్ఞానము వలన కల్గినదనియే సిద్ధమగుచున్నది; ఎందుకనిన, అజ్ఞానమును నివారించుటే జ్ఞానముయొక్క పని కాని, లేని దానిని కల్గజేయుట కాదు. దేహాదులే తామని భ్రమించు అజ్ఞానులకు శాస్త్రమునందు కర్మలను ఉపాసనలను చెప్పినంత మాత్రమున, పరమార్థ దృష్టితో ఆత్మయే బ్రహ్మమని చెప్పిన సిద్ధాంతమునకు యిబ్బంది యేమియు లేదు.

(1-1-4, భా. భా. 51; 2-3-48; భా. భా. 164, 165; బృ. 2-1-20, 323)

29. దేహాదుల సంబంధమును పెట్టుకొనియే కర్మాది కములు విధింపబడియుండును. కావచ్చును. అందు ఆ దేహాది కములు ఉండనేయున్నవి కదా! వాటిని తప్పించుకొనుట కాదు కదా! అట్టి యెడ ఈ దేహాదికముల సంబంధమున కల్గిన అజ్ఞానమును నశింపజేసుకొనుటకు ఉపాయము లేక పోయెనే - అనిన దానికి సమాధానమున్నది. దేహాదికములు నిజముగ లేవు. చక్కగ విచారించి చూచినచో ఆత్మనే దేహాదికములని మనము వ్యవహరించుచున్నాము కాని, అవి వేరుగనుండుటకు మరి యే ఆధారమును నుండుట లేదని తెలియుచున్నది. జాగ్రతయందుకాని స్వప్నము నందుకాని

వస్తువులు ఆత్మ చైతన్యమునకు వశమైయుండి గోచరించు చున్నవేకాని చైతన్యమును వదలి స్వతంత్రముగ యే వస్తువులును గోచరించుట మన మెఱుగము. సూర్యుడు జగత్తును వెలిగించినట్లు దేహాదులనెల్ల ఆత్మచైతన్యమే వెలిగించుచున్నది. సుషుప్తి సమాధి మొదలగు అవస్థలలో దేహాదికము లుండుటే లేదు. అందువలన, దేహాదులూ వాటిసంబంధమూ దానివలన కలుగు సంసారమూ ఆత్మయందు పరమార్థముగ లేదు.

(బృ. 2-4-7, భా.భా. 361; గీ. 13-33, భా భా. 299; గీ. 18-50 భా.భా. 556; గీ. 18-66, భా. భా. 598)

30. బ్రహ్మమును ఉపాసన చేయవలెననియు దాని యందు సర్వకర్మలు సర్వకామములు సర్వగంధములు సర్వ రసములు యింకను అనేక ధర్మములు ఉన్నవనియు శాస్త్రము నందు చెప్పబడియున్నది. ఉపాసనముచేయు జీవుడే బ్రహ్మ మైనచో తన్ను తానే ఉపాసించు కొన్నట్లగును కదా! జీవునియందు బ్రహ్మము యొక్క గుణములలో యే గుణమును కనపడుటలేదే! శాస్త్రప్రమాణము సంగతము కాలేదే! దీని కేమి గతియని యనుట ఎనిమిదవ సంశయము.

ఆత్మవిచారమునకు అసమర్థులు వివిధములగు దృష్టా దృష్ట ఫలములను కోరువారును నగు అజ్ఞానులను ఉద్దేశించి శాస్త్రమునందు ఉపాసన చెప్పబడినదని వెనుకనే చెప్పి యున్నాము. దేని దేనిని ఉపాసన చేయుచున్నావో అది బ్రహ్మము కాదనియు, దేహేంద్రియ ప్రాణ మనోబుద్ధులను విషయము చేసుకొనుచున్న చైతన్యమే బ్రహ్మమనియు

శాస్త్రమునందు స్పష్టముగ చెప్పబడియున్నది. తాను ఉపాసన చేయు బ్రహ్మము తన స్వరూపమున కంటె వేరని తెలియుట తగదనియు శాస్త్రము చెప్పినది. అందువలన ఉపాసనయందు చెప్పయున్న బ్రహ్మస్వరూపమున శాస్త్రమునకు తాత్పర్యము లేదు; ఉపాధుల ధర్మములనే అచ్చట బ్రహ్మ ధర్మములని చెప్పబడినది; ఉపాధులెల్లను బ్రహ్మమునందు కల్పితమై యుండుటవలన వాటిని బ్రహ్మధర్మములని ఉపచారమునకు చెప్పినట్లు తెలియవలెను.

(3-2-14, 15, భా. భా. 281; బ్ర. 1-4-10, భా.భా. 82)

81. బ్రహ్మము సకల జగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు కారణమైనదనియు బ్రహ్మము సర్వజ్ఞము - సర్వశక్తము అనియు శాస్త్రమున చెప్పబడినది. జీవుడు జగత్తును సృష్టి చేయలేడు. జీవునికి తెలియని విషయము లెన్నో ఉన్నవి. జీవునితో కానిపను లెన్నో ఉన్నవి. ఇట్లున్నప్పుడు జీవుడే బ్రహ్మమని చెప్పుట తగునా? అనునది తొమ్మిదవ సంశయము.

దీనికి పరిహార మేమనిన - జాగ్రత్ స్వప్నములలో తోచు ప్రపంచము ఆయా అవస్థలకు మాత్రము పరిమితమై అగపడుచున్నది. అప్పుడది ఆత్మచైతన్యమునకు అధీనమయ్యే అగపడుచున్నది. నిద్రలో యే జగత్తును లేదు. ఆత్మయందు అణగిపోవుచున్నది. ఇంతకును యీ జగత్తు ఆత్మయందె ఇటుగూడ కనబడి అణగిపోవుచున్నది. ఈ కారణము చేత జగత్తు లన్నిటిని సృష్టిచేయు శక్తి ఆత్మయందున్నదని

తెలిసినది. కనపడు ప్రపంచమంతయు ఆత్మచైతన్యమునకు విషయమై యుండుటవలన ఆత్మ సర్వజ్ఞుడనుటయు ఒప్పినమాట.

అయినను, బ్రహ్మము జగత్కారణమని సర్వజ్ఞమని సర్వశక్తివంతమని చెప్పుటకూడ అజ్ఞానదృష్టితోనే కాని పరమార్థతః కాదు; ఎందుకనిన, బ్రహ్మమునకంటె వేరైనదియే వస్తువు కూడ లేనే లేదనుటయే పరమార్థము.

(మా 1-6, భా. భా. 29; 2-1-14, భా. భా. 4..; 2-1-3 భా. భా. 42.)

32. బ్రహ్మమొక్కటే నిజముగనుండు వస్తువైనచో బ్రహ్మమును తెలిసికొనవలెననుకొనువాడు వేరుగ లేనట్లే అయినది; ప్రత్యక్షమే మొదలగు ప్రమాణములు నిజముగ ప్రమాణములు కాకనే పోవుచున్నవి; శాస్త్రమునందు చెప్పిన కర్మములు ఉపాసనలు వ్యర్థమగుచున్నవి; బ్రహ్మవిద్యను అభ్యసించు శిష్యుడు కాని బోధించు గురువు కాని నిజముగ లేకపోవుటచేత జ్ఞానశాస్త్రమూ వ్యర్థమగుచున్నది. ఇట్లు వ్యవహారము నంతటిని ఉఫ్ అని ఊది పారవేయుట యోగ్యమేనా అని పదవ సంశయము.

"బ్రహ్మమొక్కటే నిజముగనుండు వస్తువైనచో" అని మొదటనే సంశయమును సూచించుటకు ఆస్కారము లేదు; ఎందుకనిన, బ్రహ్మమొక్కటే నిజముగ నుండునదనియు అదే మనయొక్క ఆత్మయనియు యుక్తి అనుభవములచేత ఈవరకే సిద్ధమైయున్నది. ప్రత్యక్షమే మొదలగు ప్రమాణములు జాగ్రదవస్థలో నడచు వ్యవహారమునకు చేరినవి; అవి బ్రహ్మవిషయమున నేమీ చెప్పుటలేదు. అందువలన

వాటికెట్టి బాధయులేదు. శాస్త్రము చెప్పిన కర్మలు ఉపాసనలు క్రియాకారకములందు సత్యత్వబుద్ధికల్గిన అజ్ఞానులను ఉద్దేశించి పుట్టినవని వెనుకనే చెప్పియున్నాము.

(బృ. 2-1-20, భా. భా. 319, 324)

33. కలలో కనబడినది మెలకువలో అబద్ధమైపోయినను కలలో నిజముగనెయుండును. ఈ విధముననే, జ్ఞానుల దృష్టిలో బంధములేదు, మోక్షములేదు, సాధకుడునులేడు, సాధనమునులేదు, ముముక్షువులునులేరు; సృష్టిలేదు, స్థితిలేదు, ప్రళయమునులేదు. దీనిని తెలుపుటకు శాస్త్రము పనిలేదు, అక్కడ శాస్త్రము శాస్త్రముకాదు. ఇట్లున్నను అజ్ఞానుల దృష్టిలో యివన్నియు సత్యమే. అందువలన కర్మలుకాని శాస్త్రములుకాని జ్ఞానము కాని వ్యర్థమగుటలేదు; ప్రమాణ ప్రమేయ వ్యవహారమూ సత్యమైయుండును.

(2-1-14, భా. భా, 436; కా. 2-3-2, భా. భా. 113 బృ. 2-1-20 భా. భా 326)

34. ప్రమాణములూ శాస్త్రమూ పరమార్థములే అని చెప్పవలెనేకాని అజ్ఞానుల దృష్టిలోనే సత్యమని చెప్పుట సరికాదు. అజ్ఞానములో సత్యమనిన అవి ప్రమాణ మెట్లగునని పడునకొండవ సంశయము.

దీనికి పరహారమేమనిన-ప్రమాణమనునది నిజమగు అనుభవమునకు సాధనము. ఇంద్రియములు మొదలగునవి యిట్టి సాధనములగుట బట్టి అవే ప్రమాణములని చెప్పబడుచున్నవి. ఇంద్రియములు, దేహమును అవలంబించియున్నవి. దేహమును తానని కాని తనదనిగాని అనుకొనని వాడు ప్రమాత కాలేడు.

ప్రమాతయనిన ప్రమాణముల నుపయోగించి విషయవస్తువు యొక్క నిజమును తెలియ ప్రయత్నించువాడు. అయితే, ఆత్మయందు దేహముకాని యింద్రియములుకాని నిజముగ లేవు కాబట్టి ఆత్మ ప్రమాతయనబడదు. ఆత్మయందు దేహాదుల సంబంధమున్నదని కల్పించుకొన్న తప్ప ఆత్మ ప్రమాత కాజాలదు కాబట్టియు ప్రమాత లేక ప్రమాణ వ్యవహారము జరుగదు కాబట్టియు దేహాదుల సంబంధమును కల్పించుకొనుట యను అజ్ఞానమే అన్ని ప్రమాణములకు పునాది యగుచున్నది. అందువలన ప్రమాణములు అజ్ఞానస్థితిలోనే సత్యములని చెప్పినమాట అబద్ధముకాదు. (అ. భా. ౫)

౩౫. ప్రమాణములని చెప్పబడు ప్రత్యక్షాదులను శాస్త్రమును వదలినచో నిజమును తెలుసుకొను సాధనములు మరి లేవుకదా! ఆయెడ నిజమును తెలుసుకొనుట యెట్లు? ప్రమాణమైన శాస్త్రముకూడ అజ్ఞానములో సత్యమైనదైనప్పుడు ఆ శాస్త్రమువలన సిద్ధించు బ్రహ్మవిద్య చెప్పు జ్ఞానముకూడ అజ్ఞానములోనికే చేరిపోవును కదా! ఆ బ్రహ్మవిద్య సరియని నమ్ముట యెట్లు? అనునది పండ్రెండవ సంశయము.

ఆత్మ తానే సిద్ధమైయుండు వస్తువు కాబట్టి దాని నెఱుగుటకు మరే ప్రమాణమును పనిలేదని యీవరకే చెప్పబడినది. ఆత్మకాని దానిని ఆత్మయని అనుకొన్నప్పుడు "అది ఆత్మకాదు" అని శాస్త్రము చెప్పుచున్నది; శాస్త్రము అంతమట్టుకె ప్రమాణము. అయినను, ప్రమాణ ప్రమేయ

వ్యవహారము అజ్ఞానమే నని శాస్త్రమే చెప్పివేసినది కాబట్టి శాస్త్రమువలన జ్ఞానము కల్గిన మీదట శాస్త్రము కూడ ప్రమాణము కాకపోవుచున్నది. కాబట్టి దాని ప్రామాణ్యము నకు యెట్టి బాధకమును లేదు. ఇట్లు ప్రమాణ వ్యవహారమే తప్పు తెలివిచేత కల్గినదని శాస్త్రము తెలిపియుండుట చేత శాస్త్రమునకు అంత్యప్రమాణమను పేరు చెల్లినది.

(2-1-14, ఖా.ఖా. 486; గీ. 2-18, ఖా. ఖా. 29; బృ. 4-4-20)

36. మోక్షాదులు అబద్ధము, ప్రమాణవ్యవహారము అజ్ఞానదృష్టితో మాత్రము సత్యము, శాస్త్రము కూడ అజ్ఞాన దశయందే ప్రమాణము – అని కనపడినదంతను అబద్ధ మనుట కంటెను 'ప్రత్యక్షాదులు నిజము; శాస్త్రము కూడ ప్రమాణమే; బంధాదులును నిజమే; శాస్త్రమునందు చెప్పి నట్లు సాధనముల నాచరించి బంధమును పోగొట్టుకొనిన సత్యమగు మోక్షము జీవులకు లభించును' అని చెప్పు అభి ప్రాయమే మేలు కాదా? అనునది పదుమూడవ సంశయము.

బంధము సత్యమైయున్నచో జ్ఞానముతో నివారింప బడుట పొసగదు. అది, యే సాధనమైనను కూడ ప్రాప్యమై యుండు ఫలమును యిచ్చుటయేకాని సత్యవస్తువును నశింప జేయజాలదు, వస్తువుయొక్క పరమార్థరూపమును మార్చ లేదు. క్రొత్తగవచ్చిన దానిని నిత్యముగ నిలుపుటకును వీలుకాదు. ఈ విషయములను జ్ఞప్తియందుంచుకొనినచో బంధము సత్యముగ నుండవలెనను అభిమానము తొలగి పోవును. (బృ. 4-4-6.)

37. బంధము నిజము, దానిని తొలగించుకొనవలెను; మోక్షము నిజము, దానిని పడయవలెను; అనెడి వాదము నిలుచునదికాదు. ఎందుకనిన — పరమాత్మునికంటె వేరుగ బంధమునకు వశుడై యున్న జీవుడు యెవడూ లేడు. ఇప్పుడు నిజముగ బంధములోనే ఉన్న జీవుడు ఆ తర్వాత ముక్తుడు కాగలడని చెప్పినచో, క్రొత్తగ కల్గు ముక్తియు అనిత్యమే యగును. ఆత్మ ఆయా సంస్కారములను బొంది ముక్తికి అర్హుడగునని అనుకొనరాదు. ఎందుకనిన — సంస్కారమనిన గుణమును కలిగించుట దోషమును తొలగించుట కదా! అట్లయిన, ఆత్మలో లేని ఆత్మకంటె వేరై యుండు గుణమేదియు లేదు; ఆత్మయందు యెట్టి దోషమునూ లేదు. అందువలన సంస్కారవశమున మోక్షము వచ్చుననుట సరికాదు. బ్రహ్మము మరొకచోట నున్నదని మన మచ్చటికేగి దానిని పడయవలెననుటకూడ సరికాదు; బ్రహ్మము సర్వవ్యాపి కాబట్టి దానిని క్రొత్తగ సంపాదించుకొనవలసినదేమీ లేదు.

(1-1-4, భా భా. 49; గీ. 18-66, భా. భా. 585;
బృ. 4-4-6)

38. మోక్షము యే యితర సాధనములతోడను కల్గుట లేదనినను జ్ఞానము కల్గినప్పుడు కల్గుచున్నదని ఒప్పవలెను. దానిని బట్టి మోక్షము జ్ఞానకార్యమైనది. కార్యములన్నియు అనిత్యములగుట తప్పనప్పుడు జ్ఞానకార్యమగు మోక్షము కూడా అనిత్యమే యగును కదా! అనునది పదైదవ సంశయము.

మోక్షము జ్ఞానముతో కల్గుట లేదు. కల్గివున్న మోక్షమే జ్ఞానమువలన తెలియబడుచున్నది. సరియగు తెలివి

యనిన ఉన్నదానిని తెలుపు జ్ఞానమేకాని లేనిదానిని కల్గించునదికాదు. అందువలన మోక్షము నిత్యసిద్ధమైనదై జ్ఞానముతో గోచరమగునది కాబట్టి దీనిని జ్ఞానకార్యమని ఉపచారమునకు చెప్పబడినదని తెలియవలెను.

(మా. 7, భా. భా. 39; 1-4-4, భా. భా. 47; బృ. 3-3-1)

39. ఆత్మకంటె వేరుగ బ్రహ్మము లేనిచో బ్రహ్మమే సంసారియని చెప్పవలసి వచ్చును కదా! అనునది పదారవ సంశయము.

సంసారము నిజముగ నెవ్వరికిని లేదనుటయే సిద్ధాంతము. ఆత్మ బ్రహ్మమేనని ఆత్మయందు యెట్టి సంసారమును లేనే లేదనియు అనుభవపూర్వకముగ నిరూపింపబడినది కాబట్టి, బ్రహ్మము సంసారియని శంకించుట యే విధముగను సరిపోదు. అందువలన సంసారమున్నదనుకొనుటే అజ్ఞానము.

(1-2-8, భా. భా. 162; (గీ. 13-2, భా. భా. 217.)

40. అట్లయిన ఆత్మకు అజ్ఞానముండవలసి యున్నది కాబట్టి బ్రహ్మమునకును అజ్ఞానముండినట్లే కదా! అజ్ఞానమున్న బ్రహ్మమును తెలుసుకొనుటవలన మనకు కాగల్గినదేమున్నదనుట పదునేడవ సంశయము.

దీనికి పరిహారమేమనిన – ఆత్మ అవిద్యను తన జ్ఞానమునకు విషయముగ తెలియుచున్నాడు; దానివలన, అజ్ఞానము ఆత్మకంటె వేరేయగుచున్నదేకాని, అది ఆత్మయొక్క ధర్మము కాదు. కుండను వెలుగు వానియందు కుండయొక్క ధర్మము

లుండునా? ఉండవు. ఇట్లే, అవిద్యాదులన్నియు అనాత్మలే కాని ఆత్మ కాదు. ఆత్మస్వరూపమగు చైతన్యములో యెట్టి అవిద్యయు లేదు. సుషుప్తి సమాధి - మొదలగు అనుభవముల వలన ఈ స్వరూపమును గుర్తింపవచ్చునని యిదివరకు చెప్పబడియేయున్నది.

(బృ. 4-4-6, గీ. 13-2, భా. భా. 218)

41. అట్లైనచో, అజ్ఞానము యెవ్వరికిని లేదు, సంసారము యెవ్వరికిని లేదు_అని చెప్పినట్లైనది కదా! ఇక శాస్త్రము వలన కూడ కాగల్గిన దేమున్నది? అనునది పదునెనిమిదవ సంశయము.

అజ్ఞానముకాని సంసారముకాని యెవ్వరికిని లేదనియు మన ఆత్మ నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపమనియు తెలుసుకొన్న తర్వాత శాస్త్రమువలన కావలసిన దేమియు లేదు. దీనిని తెలియని వారికే మాత్రమే శాస్త్రము కావలసియున్నది.

(బృ. 1-4-10, భా. భా. 154; 4-1-3 భా. భా. 510)

42. ఇట్టి బ్రహ్మవిద్యవలన కాగల్గిన దేమి? బ్రహ్మజ్ఞాను లనువారుకూడ తదితరులవలెనే సంసారులయ్యే ఉన్నారు కదా! అనునది పందొమ్మిదవ సంశయము.

నిత్యశుద్ధ బుద్ధ ముక్తస్వరూపమగు బ్రహ్మమే తానని తెలుసుకొన్న జ్ఞానియు తాను కర్మల నాచరించి తత్ఫలముల ననుభవించు సంసారినని భావించుచునుకొనుట హాస్యాస్పదమగు మాట. ఎందుకనిన _ శరీరాధికములు తాననుకొనిన వానికే శరీరాదులకు అనుకూలమును అపేక్షించుటయు ప్రతి

కూలములను ద్వేషించుటయు, శరీరాదుల క్లేశనాశ విషయ ముున భయమును, యే విధముగనైనను వాటిని రక్షించు కొనవలెనను మోహమును, ఒకదానివెంట నొకటి అంటు కొనియుండును. ఈ విషయము సంసారులగు వారికందరికి తెలిసిన విషయమే. ఈ అనర్థముల గుంపే సంసారము. అయి నను, యీ దేహాదికములు తాను కాననియు అవి పరమార్థ ముగ లేనే లేవనియు తన స్వరూపము నిత్యమై శుద్ధమై జ్ఞాన స్వరూపమైనదనియు యెట్టి బంధమును లేనిదనియు తెలుసు కొన్న జ్ఞానికి పైన చెప్పిన సంసారమున్నదనవచ్చునా? అందువలన, సంసారసంబంధమగు సకల విధమగు అనర్థములును లేకపోవుటయే బ్రహ్మవిద్యకు ఒక ప్రయోజనము. జ్ఞానియైన వాడు తనకుగా చేసుకొనవలసినది యేమియు లేదు; వదలవలసి నదియు యేమియు లేదు. అందువలన వాడు యితరులవలె యెట్టి తాపత్రయములకు లోనుగాక, శాంతుడై యుండును. ఈ పరమశాంతి బ్రహ్మవిద్యకు మరొక్క ప్రయోజనము.

(1-1-4, భా. భా. 57; గీ. 3-17, భా. భా. 174; 18, భా. భా. 175)

43. ఈ బ్రహ్మజ్ఞానము అందరికి కల్గుట లేదు కదా! ఇదే నిజమైన తెలివియగుచో అందరికిని యీ విధముననే యెందుకు తెలియుటలేదు? ఈ విషయము జనుల కింతగా చర్చాస్పద మెందుకైనది? అనునది యిర్వదవ సంశయము.

ఈ జ్ఞానము అందరికి కల్గదనుమాట నిజమే. వారు దానిని అపేక్షించకుండుటయే దానికి కారణము. దురభిమాన మును వదలి శమము దమము ఉపరతి తితిక్ష శ్రద్ధ సమాధానము

లను ,సాధనములను సంపాదించి వేదాంతశాస్త్రమునందు చెప్పిన ప్రకారము బ్రహ్మనిష్ఠులగు గురువుల ఉపదేశమును పొంది దానిని గురించి ఆలోచించి చూచినప్పుడు అవశ్యముగ జ్ఞానము కల్గుచున్నది.

(1-1-1, భా. భా. 13; గీ. 2-21, భా. భా. 40; 18-50, భా. భా. 557)

**44.** బ్రహ్మజ్ఞానమువలన మన జ్ఞానము తప్పని తెలుసుకొన్నట్లే, బ్రహ్మజ్ఞానమునకంటె మరొక్క ప్రబలమైన జ్ఞానము కలిగినప్పుడు దీనిని తప్పని తెలుసుకొందుమేమో! అట్టియెడ యిదే సరియైన తెలివియని నిశ్చయించుట యెట్లు? అనునది యిరువది యొకటవ సంశయము.

ఆత్మ ఒక్కటే పరమార్థమనునది బ్రహ్మజ్ఞానము. ఈ బ్రహ్మజ్ఞానము కల్గిన తర్వాత దానికంటె వేరే రెండవవస్తువే లేదు కాబట్టి బ్రహ్మజ్ఞానమును బాధించు మరొక్క జ్ఞానము కల్గునని చెప్పుటకు అవకాశమే లేదు. ఇదే అంతిమజ్ఞానము. దీని తర్వాత సంశయముకాని ప్రమాణజ్ఞానముకాని కల్గుటకు వీలు లేదు.

(కా. 1-18, భా. భా. 57; 2-1-14, భా. భా. 438 )

**45.** దర్శనకారులందరును తమ తమ సిద్ధాంతమే సరియని వివిధములగు యుక్తులను చూపింతురు; శాస్త్రవాక్యముల నుదహరింతురు. అట్టియెడ ఆ దర్శనములు సరికాదని చెప్పుట యెట్లు? అనునది చివరి సంశయము.

మిగిలిన దర్శనకారులు చెప్పు యెన్నోవిషయములు యుక్తి ప్రమాణములులేని వట్టి కల్పనలు మాత్రమైయున్నవి. జనులు వాటిని ఒప్పవలసినదేకాని అవి లోకమున అనుభవమునకు వచ్చుటకు వీలులేదు. వారు చెప్పు ముక్తియను పరమ ప్రయోజనము కాలాంతరమున జనులు చచ్చిన తర్వాత వచ్చునదైయున్నది. అది నమ్మకమునకు వస్తువేకాని అనుభవమునకు వచ్చు వస్తువుకాదు. వారు చెప్పు విషయములందుకొన్ని అనుభవనకు వచ్చునవికూడ కావచ్చును; నిజము; కాని అవి జనుల అనుభవములో ఒక అంశమగు జాగ్రదవస్థయొక్క అనుభవమును మాత్రము గ్రహించినప్పుడు ఉపయోగపడుచున్నవి. బ్రహ్మాత్మస్వరూపమును చెప్పు వేదాంత దర్శనమట్లు కాదు. జ్ఞానము కలిగిన వెంటనే యిప్పుడే యిక్కడే ఆత్మస్వరూప సాక్షాత్కారమగుచున్నదని ఆ శాస్త్రము చెప్పుచున్నది. ఇప్పుడే అనుభవమునకు వచ్చు విషయమును చెప్పుచున్న యీ దర్శన సిద్ధాంతమును అందరూ పరీక్షింపవచ్చును. జాగ్రత్త స్వప్నము సుషుప్తియనెడి అన్ని అనుభవములను యిచ్చట లెక్కకు తీసుకొని చూచి పరమార్థమై సత్యమై యుండు వస్తువు యేదియని పరిశీలింప వలసియున్నది. ఏ యుక్తికిని యే శాస్త్రమునకును యిది విరోధముకాదు. ఈ విధమున తక్కిన దర్శనములకంటె వేందాంత దర్శనమునకొక విశేషతమున్నది.

(1–1–4, భా. భా. 216; కా. 4–2, భా. భా. 54)

**46.** ఈ బ్రహ్మవిద్య అన్నింటికి మించిన ప్రయోజనము నిచ్చు తెలివి కాబట్టి బుద్ధిమంతులూ ముముక్షువులూ అయిన జిజ్ఞాసువులు దీనిని ఆదరించుచున్నారు. ఈ విద్యవలన బ్రహ్మాత్మస్వరూపమును కనుగొనిన సర్వసంశయములు పరిహారమగుచున్నవి; హృదయగతమగు అజ్ఞానమున సంభవించు కామనల దాడివిచ్చి పోవుచున్నది; వాడు తెప్పించుకోవలసినది కాని తప్పించుకోవలసినది కాని లేదు; తప్పనిసరి చేయవలసిన పనులు వానికేమియు మిగిలిలేవు.

(ముం. 2-2-9, భా. భా. 83; ము. 3-2-9, భా. భా. 123)

శ్రీ బాలాజీ ప్రెస్, గాంధిరోడ్, చిత్తూరు.

# BOOK IN ENGLISH

**By Sri Sri Sri Swamy Satchidanandendra Saraswathiji of Holenarasipur.**

| | | |
|---|---|---|
| 1. | Narada's Aphorisms on Bhakti | 0—50 |
| 2. | Avasthatraya or the unique Method of Vedanta | 0—40 |
| 3. | How to Recognize the Method of Vedanta | 2—25 |
| 4. | Vedanta or the Science of Reality (Original Author Sri K. A. Krishnaswamy Iyer) | 20—00 |
| 5. | Suddha-Sankara-Prakriya-Bhaskara (1 to 3 Parts) | 3—00 |
| 6. | Salient Features of Sankaras Vedanta | 2—50 |
| 7. | Collected works of K. A. Krishnaswamy Iyer | 6—00 |
| 8. | Sankaras clarification of certain Vedantic carcepts | 1—50 |
| 9. | Essays on Vedanta | 6—00 |
| 10. | Misconceptions About Sankara | 3—00 |
| 11. | The vision of Atman | 2—00 |
| 12. | The upanishadic Approach to Reality | 2—25 |
| 13. | Intuition of Reality | 3—00 |

---

*For fuller list of Books Please apply to:-*

**ADHYATMA PRAKASHA KARYALAYA,**

**P. O. Holenarsipur (573211)**

**(Hassan Dt., Karnataka State)**

అధ్యాత్మ ప్రకాశ కార్యాలయము,
హాలేనరసీపురము.
(స్థాపితము : 1920)

సంస్థాపకులు:
శ్రీశ్రీశ్రీ సచ్చిదానందేంద్ర సరస్వతీ మహాస్వాములవారు,
(పూర్వాశ్రమములో)

పరిపాలకులు:
శ్రీ జయచామరాజేంద్ర ఒడయర్ బహద్దూర్,
జి. సి. బి., జి. సి. ఎస్. ఐ., మహాస్వాములవారు.

1. అధ్యాత్మ విద్యయందు, జనులకు చాల అభిరుచిని కలిగించుటద్వారా భారత సంస్కృతియొక్క ప్రచారమునకు సహాయపడుటయే ముఖ్యోద్దేశము.
2. కన్నడము, ఇంగ్లీషు, మరియు సంస్కృతము, తెలుగు, మరాఠిభాషలలో నూట అరవైఅయిదు అధ్యాత్మ గ్రంథములు ప్రకాశింప జేయబడినవి
3. కార్యాలయమునందు అధ్యాత్మ కార్యక్రమములు ఎక్కువ చేయవలెననెడి ఉద్దేశ్యముతో 1970 సంవత్సరములో కార్యాలయశాఖ బెంగుళూరులో తెరువబడినది.
4. 'అధ్యాత్మ ప్రకాశం' అనెడి కన్నడ మాసపత్రిక 43 సంII వత్సరముల నుండి నడుపబడుచున్నది.

---

బెంగుళూరుశాఖ కార్యాలయ విలాసము:-

**ADHYATMA PRAKASHA KARYALAYA,**
**BANGALORE BRANCH,**
No. 68, II Block
**Subbarama Chetty Lay-Out**
**P. O. Thyagarajanagara**
**BANGALORE - 28 (560028)**